బందాకోరు. వా. విణ: చూ, బందా.

బందారు. దే. వి. 1. ఒకచెట్టు: చూ, వృక్షము; 2: చూ, బాలక్రీడ.

బంది. సం. వి. ఇ. స్త్రీ. 1.=బందా. చెఱ: చూ, సదనము. 1; 2.=బందె. కైదు: చూ, శిక్ష. 2, విణ. 3: చూ, ప్రగ్రహము. 2; వై. వి. (1)=బంధ. నిర్బంధము: చూ, బలవంతము; వా. (2) ఇబ్బంది, బాధ.

బందికాఁడు. ద్వ. వి. రూ-బందెకాఁడు. 1 బందిపోటు దొంగ. పా. 2, ఆ. 59. చూ, హారకుఁడు. 1; 2: చెఱఁబడ్డవాఁడు; (సం).- ఉపగ్రహుఁడు.

బందికానా. వా. వి: చూ, బంది. 1 (భద్రాచల ప్రాంతమున వాడుక.)

బందిగము. వై. వి.=బంధక.—పై.—

బందిపట్టు. ద్వ. వి. బందిపోటు: చూ, హారణము. 1.

బందిపోటు. ద్వ. వి —పై.— [(రూ-బందె.)

బందియ. వై. వి.=బంధక: చూ, బంది. 1.

బందు. దే. వి. 1. బోరుపపిట్ట. చూ, బోరుప (శకుంతి); వై. వి. 2. ఆవరణము చూ, స్థగనము; 3: చూ, దాఁచుట; 4 =బంధ. పెట్టె మొదలగువాని మూలల బిగించెడి యినుములోనగువాని తగడు; 5.=బంధ. నిరోధము: చూ, సంరోధము.

బందుకట్టు. వై. వి: చూ, సమాఖ్య. 2.

బందుగు. వై. వి.=బంధు. 1.(రూ-బందుగుఁడు-బందువు-బందువుఁడు.) :చూ, సంబంధి. 1; అం. 2: చూ, అష్టైశ్వర్యములు. [ఆ. 70.)

బందుగుఁడు. వై. వి.=—పై.—(నీలా. 3.

బందువు. వై. వి.=—పై—

బందువుఁడు. వై. వి.=—పై.—

బందె. వై. వి.=బంధక. 1. చెఱ: చూ, బంది. 1; 2: చూ, బంది. 2; 3. పశువులచెఱ. స్వా. 3, ఆ. 128: బందెలదొడ్డి; 4. నిర్బంధము- చూ, బలవంతము. [6, స్క-ం. 446.

బందెకత్తె. వై. విణ. చెఱలోవేయునది. భాగ..

బందెకాఁడు. ద్వ. విణ: చూ, బందా.

బందెకానా. వా. వి: చూ, రూ-బందికానా.

బందెగొను. ద్వ. స. క్రి. చెఱఁబెట్టు.

బందెడ. దే. వి. శ్వేతసురస*: చూ, వావిలి.

బందెలదొడ్డి. వా. వి: చూ, బందె. 3.

బందెలపోతు. ద్వ. విణ. చెఱవేయుస్వభావముగలవాఁడు: చూ, బందా.

బందోబస్తు. వా. వి. కట్టుదిట్టము, జాగ్రత్త: చూ, హుసారు.

బంధకము సం. వి. అ. న. 1.=బందిగము: చూ, బంది 1; 2. మాఱుపు: చూ, వినిమయము; పుం. 3 కుదువ: చూ, వారకము. (1).

బంధకవిత్వము. అం చక్రము, ఖడ్గము, రథము లోనగువాని యాకృతులుగఁ బద్యములు చెప్పుట: చూ, మాటలల్లుట.

బంధకి. సం. వి. ఈ. స్త్రీ. 1. అంకులాఁడి: చూ, స్వైరిణి; 2. ఆటకత్తె: చూ, స్త్రీ; 3. ఆఁడేనుగు: చూ, హస్తి.

బంధనము. సం. వి. అ. న. 1. కట్టు, ప్రసితి: చూ, బంధము. 1; 2. కట్టుటకుఁదగిన సాధనము; 3: చూ, బంధకము. 3; 4. కొల: చూ, హింస. 1; 5 కైదు: చూ, బంది. 2; 6. చెఱసాల: చూ, బంది. 1; 7. తొడిమ: చూ, వృంతము. 1; 8.=బందము: చూ, లంకియ. 2.

బంధనములు. అం. మూలము, ధాన్యము, జాలాంధరము. (3).

బంధనాలయము. సం. వి. అ. పుం. చెఱ, చెఱసాల: చూ, సదనము. 1.

బంధము. సం. వి. అ. పుం. 1: అనుబంధము, అభిమరము, ఆకలనము, ఉత్థానము, ఉద్దానము, కచము, కలహము, ఝు, త, నిబంధన

ము, నిబంధము, నియమము, నిర్బంధము, పరిసితి, బంధనము. అవ్య.—ఆజ్, విణ - నియమితము.(తె).—నిమితము; వి.—(తె).- కట్టనము, కట్టు, కట్టుట, తగులము-తగులు, తెవులు-తెవులు, పెన, బారి; 2. చెఱసాల: చూ, బంధనాలయము; 3 కుదువ: చూ, వారకము (1); 4. కావ్యరచనావిశేషము; 5.సంయోగవిశేషము చూ, బంధములు.

బంధములు. అం: చూ, రతిబంధములు. (చూ, కామము.)

బంధస్తంభము. సం వి. అ. పుం. (ఏనుఁగును కట్టెడు) కట్టుకంబము: చూ, స్తంభము. 1.

బంధించే. సం. స. క్రి: చూ, సంధించే

బంధుకము సం. వి. అ. పుం. రూ-బంధూకము. మంకెన *. చూ, రక్తకము.

బంధుజీవకము. సం. వి. అ పుం.—పై—

బంధుత. సం. వి. ఆ. స్త్రీ. బంధుసమూహము: చూ, సంబంధము. 1.

బంధుర. సం. వి. ఆ. స్త్రీ: చూ, వేశ్య.

బంధురము. సం. వి. అ. న. రూ=బంధూకము. 1. కిరీ[illegible]: చూ, సీసకము (1); పుం. 2. కలహంస: చూ, హంస; 3: చూ, పక్షి; 4. నూనెమడ్డి. చూ, స్నేహము. 2, 5. ఆఁడు గుఱి: చూ, భగము. 12; 6: చూ, బంధుజీవకము*; విణ. 7 ఒప్పిదమైనది: చూ, హృద్యము: 8. వంగినది. రూ-బంధూరము: చూ, వక్రిమము; 9. మధ్యోన్నతమును పార్శ్వానతమునైనది;అం. 10: చూ, వృత్తము. 1 ("న, న, న, న, స, భ, భ, భ గురువులు. 14 యతి, 25 ఛందస్సు.")

బంధురితము. అం: చూ, ఉత్తానకరణబంధములు.

బంధులుఁడు. సం. వి. అ. పుం. అంపటాలికొడుకు: చూ, నూనుఁడు. 1.

బంధువినాశము. అం: చూ, వింశతివిగ్రహములు.

బంధువు. సం. వి. ఉ. పుం. 1 =బందుగు: చూ, బందుగు; 2. జ్ఞాతి: చూ, సగంధుఁడు. 2; 3: చూ, స్నేహితుఁడు. 1; 4: చూ, బంధుజీవకము*.

బంధూకపుష్పము. సం.వి.అ.పుం. చూ, వేగిస*.

బంధూకము. సం. వి. అ. పుం. 1: చూ, రూ-బంధుకము*; 2. చూ, బంధూకపుష్పము

బంధూరము. సం. వి. అ. పుం: చూ, రూ-బంధురము.

బంఫు దే వి. చూ, పండ్లపాఁచి.

బంబ. దే. వి: చూ, స్థూలము. 2.

బంబం. వా. వి శంఖముయొక్క ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

బంబము. అం. చూ, వృత్తము. 1 (ఒక్కొక్క పాదమునకు ఒక భగణము, ఒక గురువు. 4వ ఛందస్సు)

బంబోతు. హ. విణ: చూ, బలిమికాఁడు.

బంభరము. సం. వి. అ. పుం: చూ, భ్రమరము.

బంహిష్ఠము. సం. విణ. మిక్కిలిబహువు.

బకజిత్తు సం వి. త్. పుం. భీమసేనుఁడు: చూ, వృకోదరుఁడు.

బకదారి. దే. వి పారావతవిశేషము: చూ, సురఁటి.

బకపుష్పము. సం. వి. అ. పుం. చూ, శ్రీవల్లి*

బకము. సం. వి. అ పుం. 1 =వక్క: రూ-వకము, కహ్వము, గృహబలిప్రియము, గృహబలిభుక్కు, చండవిహంగమము, జాలపాదము, బకోటము. (తె).—ఆడేలు-ఆడేలు, ఆరణపక్కి, కొంగ, కొక్కెరాయి, కొక్కెర, తక్కపకంటె, పరద, బాతు, వక్క, వక్కకొంగ, వక్కపులుఁగు, వగ్గటము, వాలుకొంగ; తద్వి.—౧. ఓదెకొంగకు.—(తె).— ఓదెకొంగ, ఓదెకొఱకు; ౨. కొంగకు.— కలీకము—కాలీకము, క్రౌంచము. (తె).— కొంగ,

చక్రి, ద్విక ము: తద్వి.—ఆఁడుజెక్కె—పకు.-(సం). కామిని(మిగతవానికి: చూ, "శకుంతి")
బటువుబిల్ల దే. వి: చూ, దిండు. 1.
బటువువాలు. ద్వ. వి: చూ, బటువడిదము.
బటూకరణము. మి. వి: చూ, వడుగు.
బట్ట వై. వి. 1.=పట' చూ, వస్త్రము (స్త్రీపురుషుల కట్టు వస్త్రమందును, పైనధరించే బట్టయందును, సాధారణముగా నూలుతో నేయఁబడిన ప్రతివస్తువుయందును వర్తించును.); 2: చూ, సురము; 3. పశువులలోనగువాని మేనిచౌట. "బట్టావు.", విణ. 4. వెంట్రుకలూడినది. "బట్టతల."
బట్టఁగట్టనివాఁడు. ద్వ. విణ: చూ, దిగంబరుఁడు 3.
బట్టకడిమి. ద్వ. వి' చూ, పాలిపిర్చియము *.
బట్టగు. వా. అ. క్రి చెఱఁగుమాయు: చూ, సమర్తాడు.
బట్టగుత్తు వై. విణ. సిగ్గుమాలినవాఁడు.
బట్టతల. దే. వి: చెంబుతల, నూలిగరసు, పేనుకొఱుకుడు. (సం).— ఇంద్రలుప్తకము-ఇంద్రలుప్తము, కేశఘ్నము.
బట్టతలకు మోఁకాళ్లకు ముడిపెట్టుట. లో. "బట్టతలలుమోఁ,కాళ్లుముళ్లుపెట్టఁగలదొకాని". (కళాపూర్ణోదయము.)
బట్టతలవాఁడు.వా.విణ (సం)-ఇంద్రలుప్తుఁడు, ఐంద్రలుప్తకుఁడు,ఖలతి-ఖలితి,ఖల్లీటుఁడు-ఖల్లీటుఁడు, ఖల్లీఘుఁడు, ఖర్వాటుఁడు,బభ్రువు.
బట్టబయలు వై. వి.(బయలు + బయలు) 1. మిక్కిలిబయలు. పర. 1, ఆ 112. చూ, వెలుపల. 1; విణ. 2. మిక్కిలి బయలైనది.
బట్టమేఁక. ద్వ. వి. ఒకపక్షి: చూ, పక్షి.
బట్టలపెట్టె. వై.వి. కరోటకము: చూ,సందుకా.
బట్టావు. వా. వి. పెద్ద తెల్లమచ్చలుగలఆవు: చూ, సౌరభేయి (ధేనువు.)
బట్టి. దే. వి. రూ-బట్టీ. 1. అదేపనిగ చేదువుట, వాగ్ధోరణి; 2. ఆవము (చూ, కావు. 6.); 3: చూ, అభ్యోయంత్రము. [శారిక.
బట్టికాఁడు. దే వి. 1: చూ, శుకము; 2: చూ,
బట్టిపగోల. దే వి: చూ, ఎత్తనగోల.
బట్టీ దే. వి: చూ, రూ-బట్టి.
బట్టు. వై. వి. చూ, పొగడుఁడు.
బట్టువాఁడు. ద్వ. వి.—పై.—
బట్టె. దే. వి. కాలవ: చూ, నది. [ము. 6.
బట్ల. దే. వి. దడ్డెము. రూ-బట్లె: చూ, పాత్ర
బట్లె. దే. వి. —పై.—
బట్వాడా. వా. వి. రూ-బటువాడా. ఉత్తరములు, వేతనములులోనగువాని నిచ్చుట.
బడ. దే. వి. 1. పెద్ద "బడగొండ": చూ, హెచ్చు 1; 2. మిక్కిలి "బడబాకినోరు": చూ, హెచ్చు. 1; [లో వాడుక)
బడకా. వా. వి బకాయి. (ఉత్తరసర్కారుల
బడగా. వా. వి —పై.—
బడగులు. వా. వి. నీలగిరిప్రాంతవాసులలో నొక జాతి. వడగరులు.
బడగొండ. ద్వ.వి. పెద్దమబ్బు: చూ, మేఘము.1.
బడప. దే. వి 1 ఆపద. చూ, విపత్తు; 2. కష్టము. చూ, శోకము.
బడబ సం. వి. ఆ స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము: చూ, హయము; 2. బ్రాహ్మణస్త్రీ: చూ, బాఁపత; 3. తొర్పుకత్తె: చూ, శంభలి.
బడబమోలు. వా. వి: చూ, సొబను.
బడబడ. దే. వి. పాఱుట తొందరమాట లోనగువానియందగు ధ్వన్యనుకరణము.పాండు, 5, ఆ. 232; చూ, హూహూ.
బడబాగ్ని. సం. వి. ఇ. పుం. బడబానలము: చూ, వహ్ని. 1.
బడబానలము. సం. వి. అ. పుం.—పై.— లక్ష్మి. 5, ఆ. 81.

బడబాలోకనాత్సుక్యము. అం: చూ, శిక్షాకాలములు.

బడలిక. దే. వి. అలయిక: చూ, శ్రమము. 1.

బడలు. దే. వి. 1. —పై.—; అ. క్రి 2: చూ, వేసరు. 2.

బడలువడు. ద్వ. అ. క్రి: చూ, బడలు. 2.

బడవ. వై. వి.=వడవా. 1. చూ, బడబ. 3; 2. దూతుఁడు. రూ-బడవా: చూ, విట దూత; వా. 3. రూ-బడవా. ఒకతిట్టు:చూ, శాపము. 1; వా. 4: చూ, రూ-బడుప.

బడవా. వై. వి.=వడవా; చూ, రూ-బడవ. 1-2-3.

బడాయి. వా. వి. 1. గర్వము: చూ, హంకారము; 2: చూ, స్తోత్రము; విణ. 3: గొప్ప, జంజాటము, డంబు-డబ్బు-డాబు. (పటాటోపమనియు వాడుక).

బడాయించు. వా. అ. క్రి. 1. అభివృద్ధియగు: వృద్ధియగు; స. క్రి. 2. అభివృద్ధిచేయు: వృద్ధిచేయు. [మాయాకారుఁడు.

బడాయికోరు. వా. వి: డాంబికుఁడు: చూ,

బడి. దే. వి. 1. కప్పము: చూ, సిస్తు 1; 2: చూ, స్కూలు; 3. దిట్టము:చూ, సత్యము. 1, 4. క్రమము: చూ, విధము. 1; ద్రి. 5: చూ, వెంబడి. 2. పసు. 1, ఆ. 9; 6. గుణార్థకము. "ఇబ్బడి" మొ; అప. 7. భావార్థకమునందు వచ్చెడి యొకానొక ప్రత్యయము. (బడి ఏల్వాదులకగు) "ఏలుబడి, వచ్చుబడి" మొ. [భత్యము.

బడికోడి. దే. వి. రూ-కోడిబడి: చూ,

బడికోలు. దే. వి. పోలిక: చూ, సమానము.2.

బడిత. దే. వి. రూ-బడితి: చూ, లవుడి.

బడితపాఠము. వై. వి. చదివినపాఠము.

బడితి. దే. వి: చూ, రూ-బడిత.

బడిదిప్ప. దే. స. క్రి. (బడిమి + తిప్ప).

(దృష్టిదోష పరిహారార్థము) దిగఁదుడుచు: చూ, సురాళించు.

బడిపెద్ద. వా. వి. 1. అన్నితరగతులకును యజమాని; 2. తనతరగతికి యజమాని (మాస్టరు); 3. పాఠశాలకు అధికారి.

బడిమి. దే. వి. 1. బడియుట; 2. చక్రాకార భ్రమణము; 3: చూ, భూతబలి.

బడియ. దే. వి. రూ-బడె. 1. చిన్నదుడ్డుకఱ్ఱ, హరి. పూ. 6, ఆ 84: చూ, వేత్రము. 1; 2: చూ, శవయానము.

బడియు. దే. స. క్రి: చూ, బడిదిప్పు.

బడిలి. దే వి. బెజ్జము: చూ, రంధ్రము. 1.

బడివారడి. వా. వి. రూ-బడేవారడి. 1. రెంటికినిగల విశేషభేదము; 2. ప్రతివానికిని వేసెడుపన్ను.

బడిశము. సం. వి. అ. న. (రూ-బడిశ-బడిశి-బలిశము): చూ, మత్స్యబంధనము.

బడిసివాటు. దే. వి. 1: చూ, సురాళింపు; విణ. 2. దిగఁదీసివేసినది. కాశీ. 7, ఆ. 51.

బడుగు. దే వి. 1: చూ, శవము; విణ. 2:చూ, శాతుఁడు. కాశీ. 4, ఆ. 50; 3. కృశము. కళా. 8, ఆ. 164: చూ, సారపు.

బడువ. దే. విణ. రూ-బాడువ-బాడవ: చూ, భూమి. 1.

బడువు. దే. విణ: చూ, రూ-బడుగు. 2—3.

బడె. దే. వి. చూ, రూ-బడియ. (చిన్నగుడ్డు కఱ్ఱకు.—భో. 4, ఆ. 45.)

బడ్డి. వా. వి: చూ, రూ-బడ్డీ.

బడ్డీ. వా. వి. రూ-బడ్డి. గడమంచె-గడవంచె.

బడ్డీకాఁపు. వా. వి. ముందుజాగ్రత. (ఉత్తర సర్కారులలో వాడుక.)

బడ్డు. దే. వి. మగగుఱి: చూ, శిశ్నము.

బణ్ణము. వై. వి. క్రొత్తయిత్తడి పాత్రముల సమూహము:చూ,హరివాణము.(పాత్రము.6.)

బద్దర. వా. వి. చీలిక: చూ, శకలము. 4.

బద్దించు. దే. స. క్రి. 1. అంచెనావేయు; 2. (సరిగనున్నదా లేదా అని) కొలిచినది తిరుగకొలుచు; వా. 3. నాణెమువారీని లెక్కకట్టు.

బద్దింపు వా. వి. నాణెమువారీని లెక్కకట్టుట

బద్దియ. వై. వి. రూ-బద్దె. 1=వస్తి. వస్త్రము మొదలు: చూ, వత్తె; 2. అపరకర్మము చేయునపుడు జెందెమువలె వేసికొనెడు వస్త్రఖండము; వా. 3. కొలతబద్దె పేపు, నాడా.

బద్దు దే. వి. 1. బొంకు. పంచ. నా. 1, ఆ. 557: చూ, వితథము; 2. అబద్ధపుమాట: చూ, శబ్దము 2

బద్దుర దే వి —పై.—

బద్దె. వై. వి.=వస్తి: చూ, రూ-బద్దియ. 1-2-3

బదరి. వై. వి.=ద్వాదశి. ఉ, హరి. 3, ఆ 122. చూ, ముహూర్తకము.

బదరిము. వై. విణ.=భదరి: చూ, మేలుకోలు.

బధిరజాపన్యాయము. పా. చెవిటివాని చెవిలో నేకాంతముఁ జెప్పినమరీతి.

బధిరవీణాన్యాయము. పా. చెవిటివానికి వీణె వినిపించునట్టిరీతి. [శంకూదనమురీతి

బధిరశంఖాన్యాయము పా చెవిటివాని చెవిలో

బధిరత. సం. వి. ఆ స్త్రీ. చెవుడు. చూ, బాధిర్యము. [చూ, బాధిర్యము.

బధిరితము. సం విణ. బధిరముగా చేయఁబడినది:

బధిరుఁడు. సం. విణ. అనేడమూకుఁడు, ఏడమూకుఁడు, ఏడుఁడు, కల్లఁడు, కల్యుఁడు. (తె).—చెవిటి, చెవిటిమూగ, పెద్దవిన్నపమువాఁడు, లవిటి, వినని వాఁడు; తద్వి.—మూఁగ చెవుడుకలవానికి — కలంబకుఁడు. (మిగతవానికి: "చూ, వినని వాఁడు.")

బధ్ధ. అం. చూ, భూచారులు.

బధ్ధకము. సం. వి. అ. పుం.=:చూ, బద్ధకము.

బధ్ధముగు మి. అ. క్రి: కట్టుపడు.

బద్ధము. సం. విణ. కట్టఁబడినది: చూ, సందానితము. 1.

బద్ధాసనము. అం. స్వస్తికాది: చూ, ఆసనములు.

బద్ధుఁడు. సం. విణ. కట్టుపడినవాఁడు.

బధ్యమానకము. అం: చూ, గతివిశేషములు.

బధ్యము. సం. వి. అ. పుం నీళ్లురాకుండకట్టిన కట్ట చూ, సేతువు. 1.

బధ్యుఁడు. సం. విణ. చావఁదగిన వాఁడు.

బనాతు. వా. వి. ఒకరకము ఉన్నిబట్ట: చూ, వస్త్రము. (బణాతు అనియు)

బనాయించు. వా. స క్రి 1. కల్పించు: చూ, సృజించు; వా. 2. దమాయించు: బుకాయించు.

బనారసు. వా. వి. కాశీపట్టాము: చూ, దేశములు.

బనియను. వా. వి. శరీరమును అంటియుండెడి చొక్కాయ: చూ, వస్త్రము.

బన్నపడు. వై. అ. క్రి. భంగపడు: చూ, ముక్కపోవు. 2.

బన్నము. వై. వి =భంగ-భగ్న. 1. అవమానము. చూ, పడి. 3; 2: చూ, విపత్తు; 3 అపజయము. చూ, పీఁక. 7.

బన్నసగము వై వి =పంచసరః. నానావిధ మణులు గ్రుచ్చినహారము. పాండు. 4, ఆ. 231: చూ, భూషణము 2

బన్నసరి. వై. వి. =—పై —య 4, ఆ. 100.

బభ్రాజమానము వా. వి తెలివితక్కువతనము.

బభ్రువు. సం. వి ఉ. స్త్రీ. 1. కపిలగోవు: చూ, సౌరభేయి (ధేనువు); పుం. 2: చూ, వెంట్రువ; 3: చూ, విష్ణువు. 1, 4: చూ, శివుఁడు; 5: చూ, వహ్ని. 1; విణ. 6 పచ్చనిది: చూ, వర్ణము. 6; 7: చూ, బట్టతలవాఁడు.

బమ. వై. వి.=భ్రమ: చూ, రూ-బమ్మ. 1-2.

బమపుర్వు. వై. వి: చూ, భ్రమరము. 1.

బమి. వై. వి.=భ్రమర.—పై —

బమ్మ. వై. వి. 1.=బ్రహ్మ. నలువ: చూ, బ్రహ్మ. 1; 2.=భ్రమ: చూ, రూ-బమ్మర; 3.=ప్రతిమ: చూ, బొమ్మ.

బమ్మచారి. వై. వి.=బ్రహ్మచారి. (రూ-బమ్మాచారి-బమ్మాసారి): చూ, వటువు. 1.

బమ్మతండ్రి. ద్వ. వి: చూ, విష్ణువు. 1.

బమ్మదేవరతండ్రి. ద్వ. వి.—పై—

బమ్మదండి. వై. వి.=బ్రహ్మదండి.*: చూ, వారాహి. 5.

బమ్మమేడి. వా. వి: చూ, రూ-బ్రమ్మమేడి*.

బమ్మర వై. వి =భ్రమ. రూ-బమ్మ: చూ, భ్రాంతి.1. [పాలుటసుర.

బమ్మరక్కసి. వై. వి.=బ్రహ్మరక్షస్: చూ,

బమ్మరించు వై. అ. క్రి =భ్రమ. రూ-బమ్మరిలు-బమ్మరిల్లు: చూ, సంభ్రమించు.

బమ్మరిలు. వై. అ. క్రి.=—పై.— [ఆ.50

బమ్మరిల్లు. వై. అ. క్రి =—పై —విక్రి. 4,

బ్రమ్మచారి.వా. వై.వి.= చూ, రూ-బమ్మచారి

బమ్మాసారి. వై. వి.=—పై.—

బమ్మెర. వై. వి.=భ్రమ: చూ, రూ-బమ్మర.

బమ్మెరపోక. ద్వ. వి. భ్రమపడుట: చూ, భ్రాంతి. 1. [హరి. పూ. 9, ఆ. 49

బమ్మెరపోవు. ద్వ. అ. క్రి: చూ, బమ్మరించు.

బయకాడు. ద్వ. వి. (బయలు + కాడు) 1. గాయకుడు. శశాం. 4, ఆ. 191; అని. 2, ఆ. 41; విజ. 1, ఆ. 184: చూ, సీకారి; 2: చూ, వైణికుడు; 3. గానవిద్యోపాధ్యాయుడు: చూ, సురాచార్యుడు; వై. వి. 4.=భయకార, భోగముమేళము వెనుక శబ్దములంగొలుపువాడు.

బయకారము. ద్వ. వి. (బయలు + కారము) యౌవనమునందుబయలుపడు శృంగారచేష్ట: చూ, శృంగారచేష్టలు. (ఆలసానిపెద్దన్నగారి ఉత్పలమాలిక.)

బయకారి. ద్వ. విణ. విలాసవతి: చూ, స్త్రీ-

బయట. వా. దశి. బహిరర్థకము: చూ, వెలపట.

బయలు. వై. వి.=బహి. 1. ఆకాశము: చూ, సురవర్త్మము; 2 బహిఃప్రదేశము: చూ, వెలుపల. 1; 3. చెట్లుచేమలులేని నిర్జలభూమి: చూ, భూమి. 1; విణ. 4. ఏమియులేనిది: చూ, శూన్యము. 1.

బయలుదామర. వై. వి: చూ, నేలతమ్మి*.

బయలుదేరు. ద్వ. అ. క్రి: చూ, నిర్గమించు.

బయలుపడు వై. అ. క్రి. రూ-బయల్పడు: చూ, సుబ్బు. 2.

బయలుపఱచు. వా. స. క్రి: చూ, వెలిపుచ్చు.

బయలుమెఱయు.ద్వ.అ క్రి: చూ, బయలుపడు.

బయలువెడలు. ద్వ. అ క్రి. 1: చూ, బయలుదేఱు; 2. కడచుబోవు: చూ, సమర్థాడు; 3. చూ, విషించు.

బయలువోవు. ద్వ అ. క్రి: చూ, బయలుపడు.

బయల్పడు. ద్వ. అ. క్రి.—పై.— [కరువు.

బయానా. వా. వి. రూ-బజానా: చూ, సంచే

బయావారి. వా. అవ్య. వివరమైన.

బయికలు. దే. వి. బ. రూ-బైకలు: చూ, బయ్యంకలు.

బయిజే. దే. వి: చూ, రూ-బైజే.

బయిడాలము. దే. వి: చూ, రూ-బైడాలము.

బయిరవాసము. వై. వి.=బహిర్వాసము: చూ, రూ-బైరవాసము. (బయిరువాసముఅనియు).

బయిరాగి. వై. వి.=విరాగి. బ్ర. 2, ఆ. 175: చూ, రూ-బైరాగి.

బయిరి. దే. వి: చూ, రూ-బైరి.

బయిలగు. ద్వ. అ. క్రి: చూ, రూ-బైలగు. ఉ, రా. 2, ఆ. 137.

బయిలు. వై. వి.=బహి: చూ, రూ-బైలు.

బయిసణ. దే. వి: చూ, రూ-బైసణ.

బయిసి. వై. వి: చూ, రూ-బైసి. (భాగ్యమునకు.—పంచ. నా. 1, ఆ. 83.)

బయిసికిలు. వా. వి: చూ, రూ-బైసికిలు.
బయిసుక. దే.వి: చూ, బైసుక.ఉ,హరి.3,ఆ 124.
బయ్యంకలు. దే. వి. బ. బైకలు: చూ, వేవిళ్లు.
బయ్యాఁడు. దే. విణ: చూ, సోమరి.
బరందు. వా. వి. బ్రాంది: చూ, సుర. 2.
బరక. దే. విణ. బరుసు; చూ, రూక్షము. 1.
బరకము. దే. వి. 1. దూదిబరువు; 2. నారనూలు లోనగువానితో నేయఁబడిన వస్త్రభేదము· చూ, వస్త్రము.
బరకు వా.స. క్రి (రూ-బరుకు-బఱుకు-బఱుకు) చూ, రూ-బరుకు (గోదావరీమండల ప్రాంతమునవాడుక.) [ముద్రి
బరగడ. దే వి. ధాన్యపురాసిపైముద్రి చూ,
బరగడము. దే. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.
బరడు. వై. వి =బర్బర. 1. పెసరపొట్టు. రూ-బెరడు, ఖొప్పర-బొబ్బర, పెచ్చు. (సం)-కోశము-కోషము, నిష్పావము, బర్బరము; (మిగతవానికి "చూ, శకలము 1-2"); 2. చర్మము: చూ, రూ-బెరడు. 1; 3. చింత వెలఁగ ఆనబ లోనగువానిడొలక: రూ-బెరడు: చూ, బోలు. [పాత్రము. 6
బరణి. వై. వి =భరణి. పా. 4, ఆ 43· చూ,
బరణిమేకా. వై వి.=భరణి రూ-బరణిమేకా: చూ, రిక్క.
బరతరఫు. వా. వి. సమాప్తము. [బులుఁగు.
బరతుకిట్ట. వై. వి.=భరత: చూ, సాఁకుడుఁ
బరపట. దే. వి. 1. ఒకానొకతృణము: చూ, తృణము. 1; బ. 2: చూ, ధాన్యము.
బరమా. దే. వి: చూ, పిడిసాన.
బరవసము. దే. వి. 1. ధైర్యము: చూ, స్థైర్యము. 1; 2. ఉత్సాహము: చూ, యత్నము; 3.=పరవశ: చూ, విస్మృతి; 4: చూ, సంతోషము.
బరాడీబ్రాహ్మణులు. అం: చూ, మహారాష్ట్రులు. (వీరుశుక్లయజుర్వేదులు. మాధ్యందిన శాఖవారు. కొందఱు ఋగ్వేదులు. ఋక్శాఖ ఆశ్వలాయన సూత్రముగలవారు. వీరారు దేశవాసులు. చాలకాలము నైజాము రాజ్యమునవసించినవారగుటచే వీరిని వీరారు బ్రాహ్మణులనియు, బంగాళీలనియు అందురు) (చూ, బ్రాహ్మణులు)
బరాతము. వా. వి. 1 లిఖితపూర్వకమైనఆజ్ఞ: చూ, సెలవు.1; 2: హుండి-హుండీ; 3 బత్తెము: చూ, సాదము (1) (ఉత్తరసర్కారులలో వాడుక)
బరాబరి. దే వి. 1. రూ-బరాబరిక. ఎచ్చరిక: చూ, హెచ్చరిక. 1; విణ. 2. సరియైనది: చూ, సుషమ 2; వా. 3. లక్ష్యములేనిది. "నిమాట పెండ్రికముక్కవలె బరాబరి."; 4. నిండింపఁబడినది· చూ, పూరితము. 1.
బరాబరిక. దే. వి: చూ, రూ-బరాబరి. 1.
బరావర్దు. వా. వి. జీతములులోనగువానిబిల్లు. (అక్విటెన్సురోలు).
బరి. వా. వి 1: చూ, రూ-బడి. 2; దే. వి. 2. చూ, ప్రక్క. 2; 3: చూ, శత్రువు. కాశి. 6, ఆ 294; 4: చూ, తోత్రము. 1; 5: చూ, తోత్రము. 2; 6. దొంగ.స్వా. 5, ఆ. 82· చూ, హారకుఁడు. 1; 7: చూ, ప్రక్క. 3. జై. 2, ఆ. 13, 8. గీటు: చూ, రేఖ. 3; 9. వృత్తియందు బరిగి శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. [యీఁటె: చూ, బరిగమ్మ.
బరికట్టె. ద్వ. వి. (బరిగి + కట్టె) అలుఁగులేని
బరికాఁడు. దే. వి. మావటి. నిర్వ. 7, ఆ. 55: చూ, హస్త్యారోహుఁడు.
బరికాయ వా. వి. కొంటె: చూ, వ్యాధుఁడు.2.
బరికె. దే వి. 1. గఱుకులుగల యెండినతాటిమట్ట; వా 2 (చింత) జాఁక. "పంతులు చింతబరికెతోకొట్టెను" చూ, వేత్రము. 1;

3. చింపిలి, జోంజోటు. మార్క. 5, ఆ. 141: చూ, వెండ్రుక. 1.

బరిగమ్మి. ద్వి. వి. (బరిగ + కమ్మి). చూ, హేతి (బాణము. 1).

బరిగి. దే. విశే: చూ, శూన్యము. 1.

బరిగిరాతు. ద్వి. వి. పల్లము వేయని గుఱ్ఱము మీఁద నెక్కెడు సారథి: చూ, సారథి.

బరికోల. దే. వి. 1: చూ, బరి. 4; 2. శరము. చూ, బాణము. 1. వసు. 3, ఆ. 149.

బరిచి దే. వి. రూ-బరిచీ. ఈఁటె: చూ, బాణము. 1.

బరిచీ. దే. వి.—పై.—

బరిజోగి. ద్వి. వి. (బరిగ + జోగి)· చూ, పాములవాఁడు. హై. 7, ఆ. 82

బరిడేగవ్వ. ద్వి. వి. చూ, భక్ష్యము.

బరిడెపురుగు ద్వి. వి. బొద్దింక· చూ, మక్షిక

బరిణిపురుగు. ద్వి.వి.—పై.-(రూ-బరిణెపురుగు)

బరిణెపురుగు. ద్వి. వి.—పై.—

బరిణెచుక్క. నై.వి =:చూ, రూ-బరణిచుక్క.

బరితము. వై. వి.=భరత: చూ, బరతుపిట్ట.

బరితోలు. వా. వి. పార్శ్వపుచర్మము: చూ, బెరడు.

బరిదెగు. వా. అ. క్రి: చూ, విడిపడు. 4.

బరిపోటు. అం. (చూ, విన్నాణములు): చూ, మల్లశాస్త్రము.

బరిమేను. వా. వి. దిగంబరదేహము. చూ, [శరీరము.

బరివాఁగె వా. వి. 1. ప్రక్క: చూ, పార్శ్వము. 2; 2: చూ, పురోభాగము.

బరివెంక. దే. వి: చూ, శాఖోట *.

బరిస. దే. వి: చూ, బడిత.

బరుకు. దే. స. క్రి. రూ-బరకు. 1. తోలులేచునట్లు గీఱు, బఱుటు; 2. గీఱు: చూ, అక్కు. 2.

బరుజో. దే. వి: చూ, భూషణము. 2.

బరువడి. దే. ద్రి. మరల. భో. 3, ఆ. 253: చూ, వెండియు.

బరువసము. వా. వి: చూ, రూ-బరవసము.

బరువు. నై. వి.=భర. రూ-బలువు. 1: చూ, భారము. 1; 2. సరకులునింపిన కంట్లము లోనగునది. [సింహాస్యము.

బరుసడ్డసరము. నై వి. అంబష్ఠము*: చూ,

బరుసు. నై వి.=పరుష. 1: చూ, గఱుసు. 1; 2. విశే. కఱకైనది: చూ, రూక్షము. 1.

బర్కరము. సం. వి. అ. పుం. 1. ప్రాయపు పశువు: చూ, మృగము. 1; 2. మేఁక: చూ, మేషము.1; 3. పరిహాసము: చూ, హేళి.

బర్బర. సం. వి. ఆ. స్త్రీ: చూ, వాయింట *.

బర్బరద్విజుఁడు. సం. విశే: చూ, మిడిపండ్లవాఁడు.

బర్బరము. సం. వి. అ. పుం. 1. చూ, బారంగి*; బ. 2.=బొబ్బర. చూ, ధాన్యము; 3 =బరడు: చూ, శకలము.1-2; విశే. 4. గఱుకులు గలది. హై. 1, ఆ. 14; అం. 5: చూ, దేశములు.

బర్బురము. సం. వి. అ. పుం: చూ, బొబ్బలి *.

బర్బూరము. సం. వి. అ. పుం: తుమ్మ*. చూ, విట్ఖదిరము.

బర్హధ్వజి. సం. వి. ఇ. స్త్రీ: చూ, పార్వతి.

బర్హపుష్పము. సం. వి. అ. న. (రూ-బర్హిపుష్పము-బర్హము) 1. గండివనము*: చూ, రాజార్హము; 2. పచ్చోరు: చూ, హరితపత్రి; 3. మాచిపత్రి*: చూ, స్థౌణేయము. 2.

బర్హము. సం. వి. అ. పుం, న.—పై.—; 4. నెమిలిపురి: చూ, శిఖండము; 5. ఆకు: చూ, సొరుగాకు (పర్ణము. 1.)

బర్హి. సం. వి. న్. పుం. 1.=బర్హిణము. నెమలి: చూ, శిఖి 2; 2. దర్భ *: చూ, హరిత (తృణము. 1.); 3 అగ్ని: చూ, వహ్ని. 1; 4. కురువేరు*: చూ, హ్రీబేరము: అం. 5: చూ, తానములు.

బర్హిచూడము. సం. వి. అ. వ. నెమలిజొట్టుచెట్టు: చూ, పూతికరజము.
బర్హిణము. సం. వి. అ. పుం: చూ, బర్హి 1-2.
బర్హిపుష్పము. సం. వి. అ. న: చూ, రూ-బర్హ పుష్పము. [చూ, వేలుపు.
బర్హిర్ముఖుఁడు. సం. వి. అ. పుం. నిర్జరుఁడు:
బర్హిశ్శుష్మ. సం. వి. న్. పుం: చూ, వహ్ని. 1
బర్హిష్ఠము. సం. వి. అ. న: చూ, బర్హి. 4.*
బర్హిస్సు. సం. వి. స్. పుం: చూ, బర్హి. 2-3.
బఱకు. వా స. క్రి: చూ, రూ_బరుకు.
బఱటు. దే స.క్రి.గోఁకు.భో 6,ఆ.383 చూ, బరుకు 1-2; 3. సైఁగాగోఁకు.
బఱబఱ దే వి ఈడ్చుటయందగుధ్వన్యనుకరణము చూ, హరాహరా.
బఱుకు. వా. స. క్రి: చూ, రూ—బరుకు.
బఱ్ఱె. దే. వి గేదె: చూ, మహిషి. [లము. 1
బల్ చారలమెకము. వా. వి. పులి చూ, శార్దూ
బల. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, ముత్తవపులగము *; 2. విద్యావిశేషము: చూ, విద్యలు; అం. 3: చూ, తతవాద్యములు.
బలఁగము. వై.వి.=పరిగ్రహః.రూ-బలగరము-బల్గము, మంది.కళా. 3,ఆ. 136:చూ, పరివారము.1. [రామా. 5, ఆ. 51:చూ, రక్షణము.
బలకరము. దే. వి. రూ-బళికరము. కావలి.
బలకరించు. వై. అ. క్రి. చూ, వ్యాపించు.
బలకాయించు దే. అ. క్రి. (బలము + ఇంచు) అతిశయించు. చూ, సందడించు. (సంధియందు వర్ణవికారము)
బలకొట్టు. దే. అ. క్రి. "ఆఁ" అనిశబ్దితిపట్టు.
బలకొను. దే. అ. క్రి. (బలము + కొను): చూ, బలకాయించు. భాగ. 3, స్కం. 967.
బలగరము. వా. వి: చూ, బలఁగము. (శు.పా.)
బలదేవుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, బలరాముఁడు; 2: చూ, వాయువు.
బలపడు. ద్వ. అ. క్రి. (బలము + పడు) అధికమగు: చూ, హెచ్చు. 3.
బలపము. దే. వి. 1. పలకపుల్ల: చూ, లేఖిని; 2. చోరసాధనము: చూ, ములుబంతి; 3. ఖటికశిల: చూ, రాయి.
బలభద్రిక. సం వి. ఆ. స్త్రీ. 1: చూ, వార్షికము. 1. * [రాముఁడు.
బలభద్రుఁడు. సం. వి. అ. పుం: చూ, బల
బలము. సం. వి. అ. న. 1. గంధము: చూ, వాసన. 1; 2. రసము: చూ, నూనెము; 3. రూపము: చూ, స్వరూపము; 4. సత్త్వ: చూ, శక్తి. 1; 5. బలుపు: చూ, శక్తి. 1; 6 సైన్యము: చూ, సేన. 1; పుం. 7 కాకి: చూ, సకృత్ప్రజము;అం 8: చూ, సప్తాంగములు (అంగము 9); 9: చూ, అశ్వహృదయ పరిజ్ఞానము; 10: చూ, గుణములు; దే. విణ. (1) అధికము: చూ, హెరాళము.
బలముతి. వా. విణ. శరీరబలముకలవాఁడు: చూ, బంబోతు. [వేష్టించు.
బలయు. వై. స. క్రి.=వల. పరివేష్టించు. చూ,
బలరామబోగులు. వా. వి. బ: చూ, ధాన్యము.
బలరాములు. అం: చూ, అవతారములు.
బలవంతము. సం. విణ. (త్. ఈ. త్,) 1. బలముగలది చూ, స్థౌల్యము; వై. వి (1)=బలాత్కారము: చూ, హతము. 2. (వైకృతము అనికొందఱు) [వ్రుఁడు: చూ, లావరి.
బలవంతుఁడు. సం. విణ. (త్)=బళాయి- బలు
బలవంతునాక్రమించుట. అం: చూ, గుణములు.
బలవత్. సం. అవ్య. మిక్కిలి యనునర్థమందు వర్తించును. (బలవత్, సుష్టు, కిముత, సు, అతి, అతీవ ఈటనుమిక్కిలియను నర్థమందు వర్తించును.): చూ, హెచ్చు. 1.
బలవిన్యాసము. సం. వి. అ. పుం: చూ, వ్యూహభేదములు. [చూ, సహస్రాక్షుఁడు.
బలసూదనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు:

బలా. దే. అవ్య. రూ-బళా. స్వా. 4, ఆ. 93: చూ, సెబాసు.

బలాక. సం. వి. ఆ. స్త్రీ. రూ-వలాక. 1. బిసకంఠిక, పెద్ద పెంటికొక్కెర: చూ, బకము; 2. బిసకంఠిక, పెంటికొక్కెర: చూ, బకము.

బలాకము. సం. వి. అ. పుం. 1. పెద్దకొక్కెర (బకము): చూ, శకుంతి. 2. కొక్కెర (బకము): చూ, శకుంతి.

బలాత్కరించు. సం. స. క్రి (తె).—ఒత్తు, లెఱుము, నెట్టుకొను. [వంతము (1).

బలాత్కారము. సం. వి. అ పుం: చూ, బల

బలాదూరు. వా. వి దిగఁదుడుపు: చూ, సురాశము. 1. [ఆ. 164.

బలారా. దే అవ్య. చూ, రూ-బలా. విజ 3,

బలారాతి. సం. వి. ఇ. పుం: చూ, బలసూదనుఁడు.

బలారి. సం. వి. అ. పుం.—పై.—

బలారుఁడు. సం. వి. అ. పుం.—పై.—

బలారె దే. అవ్య: చూ, రూ-బలా.

బలారే. దే. అవ్య.—పై.—

బలాహకము. సం. వి.అ. పుం. 1. రూ-వలాహకము. మబ్బు: చూ, మేఘము. 1; 2. రూ-వలాహకము. విష్ణువు తేరి గుఱ్ఱములలో నొకటి: చూ, హయము; 3. పాము: చూ, సర్పము.

బలి. సం. వి. ఇ. పుం. 1. కప్పము: చూ, సిస్తు 1, 2. (పూజార్థమైన) కానుక: చూ, నూడిదె; 3. చామరదండము: చూ, సురఁటి 1; 4. ఒక అసురరాజు: చూ, రాక్షసుఁడు. 1; 5: చూ, బలిచక్రవర్తి; 6. ఎర, గావు, బారి, పొలి: చూ, లాడి; విశ 7.(న్. ఈ న్): చూ, బలవంతుఁడు.

బలిచక్రవర్తి. సం. వి. న్. పుం: చిరజీవి, బలి

బలిజె. దే. వి: రూ-బజ్జె, గాజులవాఁడు.

బలితము. వై. విశ. 1 =బలిష్ఠ. బలువిడి. లాఁతు: చూ, స్థూలము. 2; 2.=బలిష్ఠ. లావైనది: చూ, స్థూలము. 4; 3.=బలిష్ఠ. బలముగలది: చూ, స్థౌల్యము.

బలితుఁడు. వా. వి: చూ, బంబోతు.

బలిధ్వంసి. సం వి. న్. పుం. రూ-బలిధ్వంసుఁడు: చూ, విష్ణువు. 1.

బలిధ్వంసుఁడు. సం. వి. అ. పుం.—పై—

బలిపుష్టము. సం. వి అ. పుం. 1. కాకి: చూ, బలము. 7; 2. వక్కుకొంగ: చూ, బకము.

బలిభుక్కు. సం. వి. జ్. పుం. కాకి: చూ, బలము. 7; 2 ఊరఁబిచ్చుక: చూ, (పిచ్చుక) శకుంతి.

బలిమి. వై. వి =బల. రూ-బల్మి. 1. దేహబలము: చూ, శక్తి. 1; 2: చూ, బలాత్కారము.

బలిమికాఁడు. ద్వ. విశ. రూ-బలియుఁడు: చూ, శక్తుఁడు.

బలియు. వై. అ. క్రి 1.=బల: స్థూలించు; 2. అధికమగు. రాఘు. 1, ఆ. 61: చూ, హెచ్చు 4.

బలియుఁడు. వై. వి. 1: చూ, బలరాముఁడు; 2 =బలవంత: చూ, బలిమికాఁడు.

బలిష్ఠము. సం. విశ. మిక్కిలిబలముకలది: చూ, స్థూలము. 4. [చూ, లోకము. 1.

బలిసద్మము. సం. వి. న్. న. పాతాళలోకము:

బలిసినవాఁడు. వా. వి: చూ, బలిమికాఁడు.

బలీయము. సం. విశ: చూ, బలిష్ఠము. [భమ. 1.

బలీవర్దము. సం. వి. అ. పుం. ఎద్దు: చూ, వృష

బలు. వై. విశ =బల: చూ, పృథువు.5- 6; 3. (వృత్తియందు బలువుశబ్దమునకు మీఁది వర్ణములోపింపఁగా మిగిలినరూపము. "బలువడి-బలువిడి." మొ). (హల్లుపరమగుచో ఉత్వమునకు వికల్పముగా లోపంబగు. ఉదా.—బల్వింట. మొ.)

బలుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, బలరాముఁడు (ఇతనినాఁగలిసంవర్తకము. రోఁకలి సౌనందము.); 2: చూ, రాక్షసుఁడు. 1; 3. కాకి: చూ, సకృత్ప్రజము; విణ. 4: చూ, బలిమికాఁడు; వా. 5: చూ, మాంసలుఁడు.

బలుగు. వా. వి. ఉపశాఖ: చూ, శాఖ. 1.

బలుగుత్తులు. నై. వి. బ. (బలువు + గుత్తులు.) చూ, ధాన్యము.

బలునంజెమెకము. వా. వి: చూ, హస్తి.

బలుపు నై. వి.=బల. రూ-బల్పు. 1: చూ, బలము. 4—5. [చూ, బలకాయించే

బలుపుకొను. ద్వి. అ. క్రి. రూ-బల్పుకొను:

బలురక్కసి. నై. వి (బలువు + రక్కసి) బృహచ్ఛదము *: చూ, స్వర్ణక్షీరి.

బలురక్కస. నై. వి.—పై.—

బలువిడి. దే. వి. రూ-బల్విడి. నిర్వ. 1, ఆ. 42· చూ, విధము. 1; 2: చూ, బలాత్కారము; 3. చూ, బలితము; నై వి. 4 =బలపతి: చూ, యుద్ధము; వా. 5. దండు· చూ, సేన. 1.

బలువు. నై. వి. 1.=బలమ్: చూ, శక్తి. 1;విణ 2. మిక్కుటము. జై. 5, ఆ. 103: చూ, హేరాళము; 3. పృథువు, పెద్ద: చూ, నుర. (3); 4.=భర. బరువు· చూ, భారము. 1.

బలువుఁడు. వా. నై. విణ.=బలవంత: చూ, బలిమికాఁడు. (ఇదివిచార్యము).

బలుసు. దే. వి. కసింద. *: చూ, వేషణము.

బలుహజ్జెమెకము. ద్వి. వి. ఏనుఁగు:చూ, హస్తి.

బలె. దే. ద్రి: చూ, పోలె.

బలే. దే. అవ్య: చూ, బలా.

బల్గము. నై. వి: చూ, రూ-బలఁగము.

బల్జె. వా. వి: చూ, రూ-బలిజె.

బల్తలమెకము. వా. వి: చూ,బలునంజెమెకము.

బల్పు. నై. వి.=బల: చూ, రూ-పలుపు

బల్పుకొను. ద్వి. అ. క్రి: చూ, రూ-బలుపుకొను. (చూ, తృణము. 1.

బల్బజము. సం. వి. అ. పుం. మొదవగడ్డి *:

బల్మి. నై. వి.=బల: చూ, రూ-బలిమి.

బల్య. సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరు *: చూ, వారాహకర్ణి.

బల్యము. సం. విణ. బలముచేయునది.

బల్ల. దే. వి. 1. కుంచేము: చూ, పర్యస్థము. 2; 2:చూ, పలక. 5; 3. కడుపులోని దుర్మాంసపుబిళ్ళ.

బల్లకట్టు. దే. వి. కాలువను ఇటునటు మనుష్యుల దాఁటించే పడవ: చూ, హోడము.

బల్లగోల. వా. వి: చూ, పంటి-పంటికోల.

బల్లాడదిట్టీ. ద్వ. వి. ఒకానొకకాసె: చూ, పస్త్రము.

బల్లి.నై.వి =పల్లి-పల్లి· చూ, హాలాహలము. 2.

బల్లిదము. నై. విణ.=బలిష్ఠ. మిక్కిలిబలముగలది: చూ, స్థూలము. 4 (వి. అనికొండలు.)

బల్లిదుఁడు. నై. విణ.=బలిష్ఠ: చూ, శస్తుఁడు.

బల్లియము. నై. వి =భల్ల. (అత్తలము. 1—2): చూ, బాణము. 1:

బల్లు. దే. వి. రూ-బల్లు 1. తెల్లవాఱుట యందగు ననుకరణము: చూ, హూహూ; 2. విఱుగుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

బల్లెకోల. ద్వ. వి. (బల్లెము + కోల): చూ, (అత్తలము. 1): చూ, బాణము. 1.

బల్లెము. నై. వి.=భల్ల: చూ, రూ-బల్లియము. 1—2. (2 వ అర్థమునకు.—అచ్చ. యు, కాం. 364.)

బల్విడి. వా. దే. నై, వి: చూ,రూ-బలువిడి.

బవ. అం: చూ, కరణములు.

బవంతము. దే.వి. కపటము:చూ,సూక్ష్మము.12.

బవంతి. దే. వి. 1. చిత్రవర్ణముగలచీర: చూ, వస్త్రము; 2. చిత్రి వర్ణము: చూ, వర్ణము. 6; 3 కొలారము- కొల్లారము- కొల్లారు, మేట్టుకొల్లారము- మేట్టుకొల్లారు చూ, సదనము. 1; వా 4. ఇల్లు చూ, సదనము. 1.

బవనిక. నై వి.=వృక్షాదని. చూ, రూ-బదనిక*.

బవరము నై వి =పరిహార: చూ, యుద్ధము.

బవరి. వా. వి రూ-బవిరి: చూ, సాంద్రము.2.

బవనిక. దే. వి. జాతరయందలి బవినీలనృత్యము.

బవవసము. నై. వి =పర్యాస: చూ, శ్రమము.2.

బవినీఁడు. దే. వి. జాతరయందు సుద్దులు చెప్పు చు బవిని యాడువాఁడు. కాశీ. 7, అ 231.

బవిర. దే. వి. గుండ్రని కర్ణభూష. ఉ, రా. 6, ఆ. 118: చూ, భూషణము. 2.

బవిరి. దే. వి. రూ-బవ్రి. 1. రేచితము: చూ, హయము; 2: చూ, భ్రాంతి. 1; విణ 3 గుండ్రము. విజ 3, అ 82 చూ, వర్తులము; 4. రూ-బలవరి: చూ, సాంద్రము. 2.

బవిసనము. నై. వి: చూ, బయిసణ.

బవిసి. నై. వి. 1: చూ, రూ-బగిసి. 1—2; 3 మర్యాద, గౌరవము: చూ, సన్మానము; 4. గణ్యత; 5. యశము చూ, సమాఖ్య. 1; 6 నియతి: చూ, సత్యము.1; 7: చూ, శుభము. 1.

బవిసిన. నై. వి: చూ, బయిసణ.

బవిసెన. నై వి —పై.—

బవిశి. వా వి. మూర్ఛ: చూ, రోగము. 1.

బవ్రి దే. విణ: చూ, రూ-బవిరి.

బష్కయణి. సం. వి. ఈ. స్త్రీ. తెఱపియావు చూ, ధేనువు.

బష్కయము. సం. వి. అ. పుం. తెఱపిమాడ చూ, సౌరభేయి (ధేనువు) [ము. 1.

బస. నై. వి. =వాస. ఉనికిపట్టు: చూ, స్థాన

బసవఁడు. నై. వి.=వృషభ. (రూ-బసవన-బసవన్న). చూ, వృషభము. 1.

బసవన. నై. వి.=వృషభ. (బసవఁడు + అన. శ. ర) (ద్వాయమని శ. ర): చూ, బసవఁడు.

బసవన్న. నై. వి.=—పై.—

బసవన్నాట. వా. వి: చూ, బాలక్రీడ.

బసవి. నై. వి. రూ-బసివి. 1. జారిణి: చూ, స్వైరిణి.; 2. శివదాసియై వ్యభిచరించుస్త్రీ: చూ, స్వైరిణి.

బసివి. నై. వి.—పై.—

బసుమము. నై. వి.=భస్మ: చూ, భస్మము.

బస్తకము. సం వి. అ న. రూ-బాస్తకము. రుమాకరలవణము, రౌమకము: చూ, లవణము. 1.

బస్తము. సం. వి. అ. పుం. 1. మేఁకపోతు: చూ, మేషము. 1; వా. వి. 2. శ్లేష్మోద్రేకమును తగ్గించుమందు.

బస్తా. వా. వి ధాన్యాదులతోనింపెడుమూట. (సంచిగాక 166 పౌనులతూనికగల సరుకు)

బస్తాంద్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. అటకమామిడి*: చూ, మామిడి; 2 ఒద్ది *: చూ, వద్ది; 3. గాడిదగడపర *: చూ, శ్వాసనము. 2; 4. మామెన *: చూ, శారిబ.

బస్తాబంది. వా. వి: చూ, పట్టుబడి.

బస్తీ వా. వి. పెద్దపట్టణము: చూ, దేశము.

బహాదరు. వా. వి గొప్పవారి బిరుదు: రూ-బహాదూరు-బహద్దరు.

బహాదూరు. వా. వి.—పై —

బహద్దరు. వా. వి.—పై.— [చేను.

బహి. సం. అవ్య. వెలుపట అనునర్థమందు వర్తిం

బహిత్రము. సం. వి. అ. న. ఒకరకముఓడః చూ, పోడము.

బహిరంగపఱచు. మి. అ. క్రి: చూ, వెలిపుచ్చు.

బహిరంగము. సం. వి. అ. న. 1. వెలుపటి అవయవము; విణ. 2 =బహిర్భము. బయలుపడినది చూ, వ్యంజితము.

బహిరంగవిద్యలు. అం: చూ, మహావిద్యలు. (చూ, ఉపవిద్యలు)
బహిరంధి. సం. వి. ఈ. స్త్రీ: చూ, వేరు పనస *.
బహిర్దేశము. వా. సం. వి. అ. న. 1. తనదేశము కానిదేశము; 2. చెంబట్టికకు వెడలుచోటు, బహిర్భూమి: చూ, భూమి 1. [కిలి.
బహిర్ద్వారము. సం. వి. అ. న: చూ, తలవా
బహిర్భూమి. సం. వి. ఇ స్త్రీ. 1. మలవిసర్జన స్థలము: చూ, భూమి. 1; 2. బయలు.
బహిర్లాపి. సం. వి. న్. పుం. ఉత్తరము వేఱు మాటలయందణఁగియుండునట్టివిషమసమస్య.
బహివడు మి. అ. క్రి. వెలివేయఁబడు
బహివెట్టు. మి. అ. క్రి: చూ, వెలివేయు.
బహిష్కరణము. సం. వి. అ. పుం: చూ, వెలి 2.
బహిష్కరించే. సం. స. క్రి. చూ, బహివెట్టు
బహిష్కారము. సం. వి. అ పుం: చూ, వెలి.2.
బహిష్కృతము. సం. విణ: చూ, ప్రతిషిద్ధము.
బహిష్కృతుఁడు. సం. విణ. బహిష్కరింపఁ బడినవాఁడు. [సమర్థాడు.
బహిష్టయగు. మి. అ. క్రి. కడకుఁబోవు: చూ,
బహుకరుఁడు. సం. విణ: చూ, ఖలపువు.
బహుక్షముఁడు. సం. వి. అ. పుం. 1: చూ, బుద్ధుఁడు; వా. 2. మిక్కిలిశాంతుఁడు.
బహుగర్హ్యవాక్కు. సం. విణ. చ్. కుత్సితపు మాటలాడువాఁడు: చూ, వక్త 1.
బహుధా. సం. అవ్య అనేకవిధములచేత.
బహుధాన్య. అం: చూ, సంవత్సరములు.
బహుపత్రి. సం. వి. ఆ. స్త్రీ. చింత * చూ, శుక్లిక.
బహుపదద్వంద్వములు. పా. "వాపీకూపతటాకములు, ధర్మార్థకామమోక్షములు." మొ
బహుపాత్తు. సం. వి. ద్. పుం. రూ-బహుపాదము. మఱ్ఱి *: చూ, వటము.



బహుపాదము. సం. వి. అ పుం: చూ, బహుపాత్తు.
బహుపుత్రిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, వాఁకుడు*. [త్తుఁడు. 1.
బహుప్రదుఁడు. సం. విణ చూ, స్థూలల
బహుమతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, సన్మానము.
బహుమానము. సం. వి. అ. న.—పై.—
బహురంధ్రిణి. సం. వి. ఈ. స్త్రీ. (తె). కమ్మచ్చు-కమ్మెచ్చు.
బహురూపము. సం. వి. అ. పుం. 1. ఊసరవెల్లి: చూ, సరటము; 2: చూ, సర్జరసము; అం. 3: చూ, వ్యంజకము. 1.
బహురూపుఁడు. సం. వి అ. పుం. 1: చూ, విష్ణువు. 1; 2: చూ, శివుఁడు; 3: చూ, మన్మథుఁడు; 4: చూ, బుద్ధుఁడు; విణ. 5. పెక్కురూపములు కలవాఁడు.
బహురోగము. సం. వి. అ. న. మేఁక: చూ, మేషము 1.
బహువచనము అం. ఒకటికన్న నెక్కువ వస్తువులను చెప్పునది. [విరిగి *.
బహువారకము. సం. వి. అ. పుం: చూ,
బహువార్షికములు. అం: చూ, ఏకవార్షికములు.
బహువిదారణపుటకఫలము. పా. చూ, ఎండుకాయలు: చూ, గుంజేకాయలు.
బహువిధము సం. విణ: చూ, వివిధము.
బహువు. సం. విణ. (ఉ. ఊ. ఈ. ఉ) 1. అధికము: చూ, హెచ్చు; 2. ఎడమగలది: చూ, సురి (3).
బహువ్రీహి. అం. అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి. (నఞ్పూర్వపద, సహపూర్వపద, సంఖ్యోభయపద, దిగంతరాళ, వ్యతిహారలక్షణ, తెనుఁగున స్త్రీసమఘటితంబయొకానొకండు బహువ్రీహిచూపట్టెడు. తెలుఁగునను బహువ్రీహిని సమాసాంతకార్యంబులు గానంబడియెడి. ఇత్యాది).

బహుసుత. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, పిల్లపీఁచేర*; విణ. 2. జాతపత్య: చూ, స్త్రీ.

బహుసువర్ణము. అం: చూ, తౌనములు.

బహుసూతి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పరేష్టుక.

బహుళ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవు: చూ, ధేనువు; 2. పెద్దయేలకి*: చూ, పత్రిల; 3. చిట్టేలకి*: చూ, పత్రిల; 4. నీలి*: చూ, శ్రీఫలి. 2; బ. 5. కృత్తికానక్షత్రము: చూ, రిక్క. [చూ, పక్షము. 1.

బహుళపక్షము. సం. వి. అ. పుం. కటిపక్కము:

బహుళము. సం వి. అ. న. ఆకాశము: చూ, సురవర్త్మము; పుం. 2: చూ, బహుళపక్షము, (చూ, శుక్లము. 3); విణ. 3. అధికము: చూ, హేరాళము; 4. తఱచే. చూ, మొత్తము.

బహుళీకృతము. సం. విణ తూర్పెత్తినది (ధాన్యము), పూతము. చూ, స్తంబకరి (ధాన్యము.)

బహుళుఁడు. సం. వి. అ. పుం: చూ, వహ్ని.1.

బహూకరణము. సం. వి. అ. న: చూ, బహూకృతి.

బహూకరించు. సం. స. క్రి: చూ, సన్మానించు.

బహూకృతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, సన్మానము.

బహ్వాశిని. సం. వి. ఇ. పుం: చూ, భక్షకుఁడు.

బళకరము. దే. వి: చూ, రూ_బలకరము.

బళా. దే. అవ్య. మెచ్చును తెలుపును (రూ-బళారె-బళారే-బళి-బళిర- బళిరయ్యా-బళిరా-బళిరె-బళిరే-బళీరె-బళీరే-బళీ-బలా-బలారె-బలారే-బలె-బలే): చూ, సెబాసు.

బళాయి. వై. విణ. = బలవాన్. కాశీ. 7, ఆ. 253: చూ, శక్తుఁడు. [6, ఆ. 55.)

బళారె. దే. అవ్య: చూ, రూ-బళా. (రామా.

బళారే. దే. అవ్య.—పై.—

బళి. దే. అవ్య.—పై.—

బళిర. దే. అవ్య.—పై.—

బళిరయ్యా. దే. అవ్య: చూ, బళారె.

బళిరా. దే. అవ్య.—పై.—(రుక్మి.5,ఆ.59.)

బళిరె. దే. అవ్య.—పై.—

బళిరే. దే. అవ్య.—పై.—

బళీ. దే. అవ్య.—పై.—(పర. 3, ఆ. 292)

బళీరె. దే. అవ్య.—పై.—

బళీరే. దే. అవ్య.—పై.— [బళుక్కున.

బళుకు. వా అవ్య. సారెకు సారెకు: రూ-బళుకున-

బళుకున. వా. దరి. 1.—పై.—; వా. వి. 2. డోఁకునందగు ధ్వన్యను కరణము: చూ, హూహూ. (రూ-బళుక్కున-బళ్లున.)

బళుక్కున. వా. దరి, వి.—పై.—

బళువు వా వి. పూటము: చూ, రూ-బలువు. (కొండదొరలవాడుక)

బళ్ల వా. వి: చూ, రూ-బల్ల. 1.

బళ్లు. వా. వి. 1: చూ, రూ-బల్లు; బ.2 బండ్లు "బళ్లుకట్టెర" (ఇదివిచార్యము)

బళ్లున. వా. వి: చూ, బళుకున. 2.

## బా

బాంకి. వా. వి: చూ, రూ-బ్యాంకి.

బాంకినోటు. వా వి: చూ, రూ-బ్యాంకినోటు.

బాండు. వా. వి. 1. పూచీపత్రము; 2: చూ, బ్యాండు. [డము. 3.

బాండవ. వై. వి. = భాండ. కుండ: చూ, భాం

బాండ్లి వా. వి. పండెడిలోహపాత్రము: చూ, హరివాణము (పాత్రము. 6)

బాంది. వా. వి. 1. వేఁడిమినిచ్చెడి మత్తుద్రవము: రూ-బాంద్రి; 2. పనికత్తె.

బాంధకినేయుఁడు. సం. వి. అ. పుం: చూ, ఱంకులాఁడి కొడుకు: చూ, సూనుఁడు. 1.

బాంబు. వా. వి. ప్రాణముతీసెడు ఒకానొక బాణసంచు: చూ, బాణసంచు.

బాఁకి. వై. వి. = భక్తి. రూ-బాఁకీ. నిలువ: చూ, శేషము.1. (అరసున్నకలదనికొందఱు)-

బాఁకీ. వై. వి.=: చూ, రూ-బాఁకి.

బాఁకు. దే. వి. 1. కటారి: చూ, బాణము. 1; 2. మేరకత్తి: చూ, రిష్టి. 2; 3. చిల్లాణము: చూ, బాణము. 1.

బాఁకుదారు. వా. వి. బాగుదార: చూ, రిష్టి.2.

బాఁజో. దే. వి: చూ, శ్యేనము.

బాఁతి. దే. వి. రూ-గాఁతి. 1 =ప్రీతి: చూ, స్నేహము; విశే. 2. అధికము: చూ, హెరాళము; వై. వి.3 =భ్రాంతి: చూ, భ్రాంతి. 1; విశే. 4. దుర్లభము: చూ, వెక్కసము. 3; 5 ప్రియము: చూ, వాంఛ.

బాఁదు. వై. స. క్రి.=బాధ కొట్టు: చూ, మొత్తు. 2. (బాదుఅనికొందఱు)

బాఁదుకొను. వై. స. క్రి.—పై.—

బాఁపఁడు. వై. వి = బ్రహ్మ- బ్రాహ్మణ. (రూ-బాఁపనుఁడు- బాఁపనయ్య): చూ, బ్రాహ్మణుఁడు.

బాఁపత. ద్వ. వి. (బాఁపన + త)=బ్రాహ్మణీ. బాఁపనక్క: చూ, స్త్రీ

బాఁపన. వై. వి. బ్రహ్మకులము.

బాఁపనకొలము. వై. వి =బ్రహ్మకులమ్, కపిలము: చూ, సంతతి. 1. [పత

బాఁపనక్క. వై వి =బ్రాహ్మణి: చూ, బాఁ

బాఁపనచీమ. ద్వ. వి.గోరోచనపురంగుగలచీమ, బ్రాహ్మి: చూ, పిపీలిక.

బాఁపనది. వా. వి: చూ, బాఁపత.

బాఁపనబూరి. వా. వి. ఒకానొక చెట్టు: చూ, వృక్షము. [89: చూ, బాఁపఁడు.

బాఁపనయ్య. వై. వి.=బ్రాహ్మణ. నీలా.1, ఆ.

బాఁపనవాఁడు. ద్వ వి.—పై.—

బాఁపనుఁడు. వై. వి.=: చూ, రూ-బాఁపఁడు.

బాఁపటికము. ద్వ. వి. (బాఁపన + టికము)= బ్రాహ్మ్య. బ్రాహ్మణత్వము.

బాకా. వా. వి. కాహళియను ఊఁదువాద్యము. "సమయమునకు లేనిబాకా—". చూ, వీణె.

బాకాపట్టు. వా. అ. క్రి. బాకాఊఁదు.

బాకి. దే. వి. రూ-బాకీ. 1. అప్పు: చూ, వారకము. (1); 2: చూ, శేషము. 1; విశే. 3 విస్తృతము: చూ, హెరాళము.

బాకినోటిమెకము. ద్వ. వి: చూ, సింహము.

బాకినోరుమెకము. ద్వ వి.—పై.—

బాకిళ్ళమారి. వా. వి. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

బాకీ. దే. వి: చూ, రూ- బాకి. 1—2.

బాకీపడు. వా. అ. క్రి: అచ్చి, అప్పుపడు- అప్పువడు, (మి) ఋణపడు.

బాకురుబాకురు. వా. వి. బాతుల అఱపునందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

బాగము. వై వి.=భాగ 1. రూ-బాగలు- బాగాలు వక్కపొడి. రాజ 1, ఆ. 134: చూ, పోఁక; 2: చూ, భాగము. 1.

బాగరి. ద్వ. విశే. 1: చూ, సౌందర్యవంతుఁడు; 2. అందకత్తె. విజ. 1, ఆ. 175: చూ, స్త్రీ.

బాగలు. వై వి. బ =భాగ; చూ, బాగము. 1 శశాం 2, ఆ 80; కళా. 4, ఆ 69.

బాగా. వా. వి 1 చూ, రూ-పాగ-పాగా; అవ్య 2. సొగసుగా.

బాగాలు. వై. వి. బ: చూ, రూ-బాగలు.

బాగు. వై. వి.=భావుక. 1. క్షేమము: చూ, శుభము. 1; 2: చూ, విధము. 1; 3: చూ, సౌందర్యము; విశే. 4: చూ, హృద్యము; 5. అందముగలది: చూ, సౌందర్యము; 6. క్షేమముగలది: చూ, సుఖము; 7 యోగ్యమైనది: చూ, శ్రేష్ఠము; 8. యుక్తమైనది: చూ, సంగతము. 3, 9. హితమైనది: చూ, సమర్థము; 10 సఫలమైనది: చూ, సిద్ధము 3.

బాగుఓగులు. జా. మంచిచెడ్డలు.

బాగుగా. వా క్రి. విశే. అందముగ, సరిగా.

బాగుచేయు. వై. స. క్రి చేక్కపఱచు.

బాగుదార. వై. వి. చిన్నకత్తి చూ, బాఁకుదారు.

**బాగులాఁడి.** ద్వ. విశే. అందకత్తె. పా. 1, ఆ. 38: చూ, స్త్రీ.

**బాజాలు.** వా. వి.బ. భజంత్రీలవాద్యధ్వని: చూ, స్వరము. 2.

**బాజాఱము.** వై. వి.=పరిసార: చూ, వ్యభి [చారము.

**బాజాతి.** వా. వి: చూ, రూ-బజాతి.

**బాజాఱు.** వై. వి.=పరిసార: చూ, రూ-బజాఱు.

**బాజా.** వై. వి. 1.=భా. కాంతి. అచ్చ. బాల, కాం. 26· చూ, వెలుతురు. 1; 2. ప్రక్క: చూ, నూఱెలు. (పార్శ్వము. 2.)

**బాజాబందు.** వై. వి.=భుజబంధ: చూ, భూషణము. 2.

**బాట.** వై. వి.=బాహ్యాట. రాజమార్గము· చూ, [మార్గము.1.

**బాటసారి** వై. విశే =వాటచారి_బాహ్యాటచారి: చూ, సమీరణుఁడు. 2.

**బాడకాచాకిరి** వా.వి. 1. వెట్టిపని; 2. ఎక్కువ [పని.

**బాడబము.** సం. వి. అ న. 1. గోడిగలమూఁక: చూ, హయము; పుం. 2.(రూ-బాడవము-బడబము-బాడాబము): చూ, బడబానలము.

**బాడవ.** వా. వి. రూ-బాడువ. పల్లపునేల: చూ, భూమి. 1.

**బాడబికము.** అం: చూ, ఉత్తానకరణబంధములు.

**బాడబుఁడు** సం. వి. అ. పుం చూ, బ్రాహ్మణుఁడు. [చూ, బ్రాహ్మణము. 1.

**బాడబ్యము.** సం. వి. అ. న. రూ-బాడవ్యము:

**బాడవ్యము.** సం. వి. అ. న.—పై.—

**బాడాసువు.** సం. వి. ఉ. స్త్రీ.=బాడిస-బాడిత: చూ, వాశి.

**బాడి.** వా. వి: చూ, బురద.

**బాడిగ.** వై. వి.=భాటక. 1· చూ, భాటకము; 2. కూలి: చూ, సంబళము. 2.

**బాడిత.** వై. వి.=బాడాసు: చూ, వాశి.

**బాడిద.** వై. వి. 1.=—పై.—(వాడుక); 2.=పారిభద్ర *: చూ, వారిదము (1).

**బాడిదము.** వై. వి.=—పై.—

**బాడియ.** వా. వి: చూ, బాడి.

**బాడిస.** వై. వి. 1.=పారిభద్ర*: చూ, బాడిద. 2; 2.=బాడాసు: చూ, బాడిత.

**బాడిసె.** వై. వి.=—పై.—

**బాడు.** దే. వి. పరదా: చూ, ముసుఁగు. 3.

**బాడుకాబంటు.** వా. వి. మానహీనుఁడు: బాడుగోలు.

**బాడుగ.** వై. వి: చూ, బాడిగ.

**బాడుగోలు.** వా. వి: చూ, బాడుకాబంటు.

**బాడుదల.** దే. వి. (బాడు + తలఁగించుట) అవమానించుట: చూ, సడి. 3.

**బాడువ.** దే. వి: చూ, రూ-బాడవ.

**బాడె.** దే. వి: చూ, బురద.

**బాఢము.** సం. వి. అ. న. 1. ప్రతిజ్ఞ: చూ, స్పర్థ. 4; క్రి. విశే. 2. పెల్లు: చూ, హెచ్చు. 2; విశే. 3. అధికము: చూ, హేరాళము.

**బాణ.** సం. వి ఆ. స్త్రీ. 1. బాణమూలము: చూ, బాణము. 1; అ. పుం. 2. నల్లగోరంట*: చూ, బాణము. 3.

**బాణనిర్మాణాదికము.** అం: చూ, ప్రమేయములు.

**బాణపుంఖి.** సం. వి. ఈ. స్త్రీ: చూ, వెంపలి*.

**బాణభేదపరిగణనము.** అం: చూ, ప్రమేయములు.

**బాణపురము.** అం. శోణితపురము: చూ, దేశములు.

**బాణము.** సం. వి. అ. పుం. 1. అంబకము, అజిహ్మగము, అస్త్రకంటకము, అస్త్రము, అలీకము, ఆయుధము, ఆశుగము, ఇషువు, ఈ, కంకపత్రము, కటంబము-కడంబము-కదంబము, కణము, కర్పరము, కలంబము-కళంబము, కాండము, కాదంబకము, కాదంబము, కింశారువు, కూటము, క్షిపణి, క్షురప్రము, ఖగము, గోవు, ఘు, ఘాతము, చక్రపుంఖము, చిత్రపుంఖము, నాళికము-నాలీకము, పత్రము, పత్రవా

హోము, పత్రి, పీలుపు, పుష్కరము, పృషత్కము, ప్రదరము, ప్రహరణము, మార్గణము, రోపము, వాజి, వికర్షము, విపాతము, విశిఖము, విహంగము, వీరతరము, శణము, శరము, శలాక, శల్యము, శస్త్రము, శిఖి, సరము, సాయకము, సాయము, సూచీముఖము, స్థూలక్ష్వేడము, స్వరువు, హనువు, హేతి. (తె) —అంప, అంపకోల, అంపఱ, అంబు-అమ్ము, అలుఁగు-అల్గు, ఆయిదము, కట్టియ-కట్టె, కత్తి, కయిదువు-కైదువ-కైదువు, కోల, గసిక, గిట్ట, చిలుకు, జిట్ట, జిరా, తీరు-తీఱు, తూపు, తోడుగు- తోడుపు- తోడ్గు, నారసము, పోటుముట్టు, బరిగోల, ములికి-ముల్కి, లకోరి, సరము, సరడు, సెల, సెలకట్టియ-సెలకట్టె. (మిగతవానికి "చూ, హేతి. 4."); తద్విశేషములు.—౧. అగ్నిప్రసారణాయుధములు.—దంచన, నాళము, శతఘ్ని. (తె) —క్రోవి, గుంటక్రోవ, జెంగి, జేజోయి, జెబురుజెంగి, జేవురు, తుపాకి, పిరంగి, సురక్రోవి; ౨. అచ్చేము ఇనుపబాణమునకు.—అమోఘు, ఏషణము, కాండగోచరము, ఖురాలకము- ఖురాలికము, నారాచము, ప్రక్ష్వేడనము, ప్రఘుము, ప్రసరము, రామబాణము, లోహనాళము; (తె).—గొరక, గొరకకట్టె, వారసము; ౩. అమ్ములపొదికి.—ఇషుధి, ఇష్వాసము, ఉపాసంగము, కలాపము, తూణము, తూణీరము, ద్రోణి, నిషంగము, శరధి, శరనిధి. (తె).—అంబులపొది- అమ్ములపొది, తరకసము, తరకసా, పాణివడము, పొది, పొన, బత్తెడిక-బత్తళి- బత్తళిక; ౪. అర్ధచంద్రబాణమునకు.—అర్ధచంద్రము, కరఫలము, క్షురప్రము, క్షురప్రగము. (తె).—కత్తివాతియమ్ము, కొఱపము-గొఱపము, సెలవంకకోల; ౫. అర్జునునిధనువునకు.—గాండివము-గాండీవము; ౬. అలుఁగులేనియీఁటెకు.—(తె).—బరికట్టె, బరిగమ్ము; ౭. అలుఁగువేసిన చేతికఱ్ఱకు.—(తె).—గొరకకట్టె; ౮. అల్పకుంతమునకు.—గొరక, గొరకకట్టె; ౯. అల్పశరమునకు.—(తె) — దోనము; ౧౦. అస్తకయానెడిబాణమునకు.—అంధకము; ౧౧. (చూ, అస్త్రములు); ౧౨. ఆకాశబాణమునకు.—ఆకాశబాణము; ౧౩. ఆగ్నేయాస్త్రమునకు.—(తె).— చిచ్చఱకోల; ౧౪. ఆయుధపు అంచునకు.—అశ్రము-అశ్రి-అశ్రి, కుటి, కోటి, కోణము, ధార. (తె).—దార, దారె, వా-వాయి-వాదర; ౧౫. ఆయుధవిశేషములు.— చక్రఫలము; ఆరాముఖము, కంపణము; కరముక్తము; కర్ణిక; కాకతుండము; కుంతము; కుణపము; కోంకణము; కౌశేయము; ఖురప్రము; గద; చక్రము; ముసుండి; విజ్జలము, శాయకము; (౧) (తె).—అంబు; ఉండసురియ; ఒడ్డగ; కట్లగుదియ; కత్తికాసు; కోల; గుమితి-గుమ్మితి; చింగోటి, చికటూరి- చిక్కుటూరి; డొంకెన-దొంకెన; తగుకత్తి; దసెన; దోదుముదారి; బాణా; మొహదా; సత్తి; సామంతరాగోల, సిరాణము; మఱియు.—౧౬. ఇంద్రధనుస్సునకు.— అధనాశ్రము, అశని-అశుని, ఇంద్రచాపము, ఇంద్రధనువు, ఇంద్రాయుధము, ఈ, ఐరావతము, కోటీరము, కౌశికాయుధము, త్రిదశాయుధము, శక్రధనువు. (తె).—కొరడు-కొఱడు, మువ్వన్నెవిల్లు, రతనపువిల్లు; (౧) చేక్కని యింద్రధనుస్సునకు.—ఋజరోహితము, రోహితము; ౧౭. ఇరువదినాలుగు బాణములకట్ట. (తె).—దస్తా; ౧౮. ఈఁటెకు.—కణయము, కుం

తము, కుంతలము, దీర్ఘాయుధము, ప్రాసాయుధము, విషాంకురము, శంకువు, శలము, శల్యము. (తె).— అత్తలము—అత్తళము, ఈఁటియ-ఈఁటె, కొంతము, చివ్వ, నేజ-నేజము-నేజా, బరిచి—బరిచీ; ౧౯. ఉపనయనకాలమందు ధరించునది.—కార్ముకము; ౨౦. ఉభయపార్శ్వధారాసికి. (తె).—దోదమ్మి—దోదుమి-దోదుమ్మి, పట్టా, పట్టాకత్తి, సైఁబు; ౨౧. ఏనుఁగు కుంభస్థలమువీఁపఁబొడిచెడిఆయుధమునకు.-అంకుశము, తోత్త్రము, వైణుకము, సృణి. (తె) — అంకుసము; ౨౨. కత్తికి.—(చూ, రిష్టి. 2), ౨౩. కత్తెరకు —కర్తరి, కృపాణి, ఖండధార. (తె)-కత్తెర; ౨౪. కర్ణధనుస్సునకు.—కాండపృష్ఠము, కాలపృష్ఠము; ౨౫. కఱకుటమ్మునకు.(తె) —కరి, కఱకుటమ్ము; ౨౬. కామదేవాస్త్రమునకు.— కామాయుధము, కేశటము, శోణము; ౨౭. గన్నేరాకువంటి యలుఁగుగల బాణమునకు.-(తె).—గన్నేరాకమ్ము; ౨౮. గఱిలేనిశరమునకు (తె) --నురుఁగు, సిరుడు; ౨౯. గుజ్జునుబోలెడు గొఱపమునకు.—కరఫలము, కేశకారము (తె) —కొడపము, కొఱపము—గొఱపము; ౩౦. చక్రాయుధమునకు —చక్రము, చక్రాయుధము. (తె) — కంటివాలు, కడిపెలుఁగు, గుదుసుకైదువు, గుదుసువాలు, చుట్టలుఁగు-చుట్టలుగు, చుట్టుకైదువ, చుట్టువాలు, పదినూఱంచులవాలు, బటువుఁగైదువ, బటువువాలు, బటువడిదము, బటువుఁగత్తి, బిల్లవాలు, వేమొనలలుఁగు, వేయంచులవాలు, సుడికత్తి, సుడియడిదము, సుడివాలు; ౩౧. చాపకర్షణబలసాధనమునకు.(తె).—తోణము-తోనమ్ము; ౩౨. చిల్లకోలకు.— కీలము, తోమరము, మండము, శక్తి, సర్వల.(తె)-చిల్లకోల, నేజ- నేజా-నేజము, తండుగోల; ౩౩. త్రికాష్ఠికి.— త్రికాష్ఠి. (తె).— తిక్కటి; ౩౪. త్రిశూలమునకు.—త్రిశూలము, పినాకము. (తె).—నుడివోనలుఁగు, ముమ్మొనవాలు; ౩౫. దుష్కంటకశరమునకు. (తె) — చిలుకమ్ము—చిలుకుటమ్ము, గోఁటమ్ము; ౩౬. దూదియేకువిల్లునకు.—తూలకార్ముకము, పంజిక, పింజనము. (తె).— పింజె; ౩౭. ధనువునకు.—అజగవము—అజీగవము—అజీగానము-అజాగవము-అజగావము—ఆజగవము, అనూకము, ఇష్వాసము, కార్ముకము, కాలపృష్ఠము, కోదండము, గాండివము-గాండీవము, గుణి, చాపము, ట, తాలము, తృణాత, త్రిణత, తృణీత, ద్రుణము, ధనువు, ధన్వము, పినాకము, బాణాసనము, శరావాపము, శరాసనము, స్థావరము. (తె).— విలు-విల్లు, సింగాణి-సింగణి-సింగిణీ, కమాను; ౩౮. నాలుగుమూరలవిల్లునకు — కోదండము; ౩౯. నాలుగుపఱ్ఱలు తీరిన ఇనుపదండమునకు. (తె). చేవుకాఁడిగుదియ—వాకాఁడిగుదియ; ౪౦. నాలుగుమూరల బాణమునకు.—గడ (తె).—గుదియ, దుడ్డు; ౪౧. నైరృతిధనువునకు.— కమలము; ౪౨ పండెఁటె-పందిపోటు; ౪౩. పట్టిసమునకు.— పట్టిసము. (తె) —అడ్డకత్తి, మొహాదా; ౪౪. పాశుపతాస్త్రమునకు —పాశుపతము; ౪౫. పెద్దపిరంగికి (తె).—దంచేన-దంచేనము- దెంచేనము, పిరంగి, సుకోలి, సుబాణము; ౪౬. (చూ, పరిమేయములు); ౪౭. ప్రాసాయుధమునకు — కుంతము, ప్రాసము; ౪౮. బరిగోలకు.— తోత్రము. (తె).—బరి, బరిగోల; ౪౯. బలరాముని గదాయుధమునకు.— ఖేటము; ౫౦. బల్లెమునకు.—ఖుంజము, ఖేలి, ఘల్లము. (తె).— అత్తలము-అత్తళము, బల్లియము-బల్లెము—బల్లె

